శ్రీః

# శ్రీవాగ్దేవీస్తోత్రమ్

## ప్రపంచసార తంత్రాంతర్గతం (అష్టమపటలం)

**శంకరాచార్య రచితమ్**

తాత్పర్యము:

**మేళ్ళచెర్వు వేంకటసుబ్రహ్మణ్యశాస్త్రి**

సంస్కృత అధ్యాపకుడు, శ్రీ గోరంట్ల వెంకన్న సంస్కృత కళాశాల– తిమ్మసముద్రము.

* * * *

**1. అమలకమలాధివాసిని!**
**మనసో వైమల్యదాయిని! మనోజ్ఞే!**
**సుందరగాత్రి! సుశీలే!**
**తవ చరణాంభోరుహం నమామి సదా॥**

ఆచార్య శంకరులు తమ "ప్రపంచసారతంత్రం" అనే తంత్రశాస్త్ర గ్రంథంలో సరస్వతీ తంత్రం వ్యాఖ్యానించి సరస్వతీ హోమాదులు పూర్తయిన తర్వాత చేయవలసినదిగా ఈ "వాగ్దేవీస్తోత్రము" ను రచించారు.

**తాత్పర్యము:–** శుభ్రవర్ణమయిన కమలములో ఆసీనురాలయినదానా!మనస్సును గూడ శుభ్రముగా చేయుదానా! మనోహరమయిన దానా! సుందర స్వరూపము గలదానా! సాధుస్వభావము గలదానా! నిత్యము నీ చరణకమలానికి నమస్కారము చేసెదను.

**2. అచలాత్మజా చ దుర్గా**
**కమలా త్రిపురేతి భేదితా జగతి।**
**యా సా త్వమేవ వాచా**
**మీశ్వరి! సర్వాత్మనా ప్రసీద! మమ॥**



**తాత్పర్యము:–** పర్వతరాజపుత్రి అని, దుర్గ అని, పద్మ అని, త్రిపుర సుందరి అని ప్రపంచంలో భిన్ననామాలు గల మహాశక్తివి నీవే! ఓ వాగీశ్వరీ! నాయందు సర్వవిధముల అనుగ్రహము చూపుము.

**3. త్వచ్చరణాంభోరుహయోః**
**ప్రణామహీనః పునః ద్విజాతిరపి।**
**భూయా దనేడమూకః**
**త్వద్భక్తో భవతి దేవి! సర్వజ్ఞః॥**

**తాత్పర్యము:–** తల్లీ! నీ చరణ సరోజములకు నమస్కరింపనివాడు ద్విజుడయినను మూగవాడయిపోవును. నీకు భక్తుడయినచో సర్వజ్ఞుడు కాగలడు.

**4. మూలాధారముఖోద్గత**
**బిసతంతునిభప్రభా ప్రభావతయా।**
**విసృతలిపివ్రాతాహిత**
**ముఖకరచరణాదికే! ప్రసీద! మమ॥**

**తాత్పర్యము:–** మూలాధారచక్రము నుండి ఉద్భవించిన నాదశక్తి "తామర తూటి దారము" వలె అత్యంత సూక్ష్మమైనది. "బిసతంతు తనీయసి" అని లలితా సహస్రనామాల్లో చెప్పబడిన శక్తి అదే. "నీవారశూకవత్తన్వీ" అని మంత్రపుష్ప సూక్తములో చెప్పబడిన శక్తియు అదే. ఆ 'నాదశక్తి' నుంచియే రకరకాల అక్షర సముదాయం ఏర్పడింది. ఈ అక్షరసముదాయమే సరస్వతికి శబ్దమయ శరీరము. ఈ విధముగా కుండలినీ ప్రభావంతో వెల్వడిన స్వర వ్యంజనములతో ఏర్పడిన వైఖరీ రూపముతో వైభవముగా వెలుగొందు దేవీ! నన్ను అనుగ్రహింపుము.

**5. వర్ణతనోఽమృతవర్ణే**
**నియతమతిభిః వర్ణితేపి యోగీంద్రైః।**

**నిర్ణీతికరణదూరే!**
**వర్ణయితుం దేహి దేవి! సామర్థ్యమ్॥**

**తాత్పర్యము:–** వర్ణ స్వరూపమైనదానా! అమృతం వలె శుభ్రమైనదానా! అమృత వర్ణమైన ఓంకార స్వరూపము గలదానా! మహామతులయిన యోగీంద్రులు ఎంతగా వర్ణించినను "ఈమె స్వరూపం ఇంతే అని, ఇదే అని" నిర్ణయించటం సాధ్యం కాదు. అట్టి అనిర్వచనీయ స్వరూప సామర్థ్యముగల సరస్వతీమాతా! నాకు నీ వర్ణనా సామర్థ్యమును ప్రసాదింపుము.

**6. ససురాసుర మౌళిలస**
**న్మణిప్రభాదీపితాంఘ్రియుగనలినే!**
**సకలాగమ స్వరూపే!**
**సర్వేశ్వరి! సన్నిధిం విధేహి మయి॥**

**తాత్పర్యము:–** సురలయినా అసురులయినా నాలుకపై పలుకు రావాలంటే సారస్వతానుగ్రహం అవశ్యంగా కావలసినదే. అందువలన దేవాసురులందఱు ఆమె పాదాలకు నమస్కరించటం సహజంగా జరిగేదే. అందువలన దేవాసుర కిరీటమణికాంతులు ఆమె కాళ్ళకు నీరాజనం పట్టుచున్నవి. అటువంటి చరణాలుగల సరస్వతి, ఆ సకలాగమ స్వరూపురాలు. ఆ సర్వేశ్వరి తనలో సన్నిధి కల్పించికొనాలని ఆచార్యులు ఈ శ్లోకంలో వేడినారు.

**7. పుస్తక జపపటహస్తే!**
**వరదాభయ చిహ్నచారుబాహులతే!**
**కర్పూరామలదేహే!**
**వాగీశ్వరి! విశోధయాశు మమ చేతః॥**

**తాత్పర్యము:–** పుస్తకము జపమాల ధరించినదానా! వర, అభయ చిహ్నలతో మనోహరంగా మెఱయుచున్న బాహువులుగలదానా! కర్పూరమువలె నిర్మల



మైన దేహం గలదానా! ఓ వాగీశ్వరీ! నా మనస్సును శోధించి నిర్మల పఱచుము.

**8. క్షౌమాంబర పరిధానే!**
**ముక్తామణి విభూషణే! ముదావాసే!**
**స్మితచంద్రికావికసిత**
**ముఖేందుబింబేఽంబికే! ప్రసీద! మమ॥**

**తాత్పర్యము:–** తెల్లని పట్టువస్త్రం ధరించినదానా! ముత్యాలసరాలు అలంకరించినదానా! సంతోష నివాసమయినదానా! చిఱునవ్వు వెన్నెలలు వెలయించే ముఖచంద్రబింబము కలదానా! అంబికా! నా యెడ ప్రసన్నురాలవు కమ్ము.

**9. విద్యా రూపేఽ విద్యా**
**వినాశిని విద్యోతితేంతరాత్మ విదామ్।**
**గద్యైః సపద్య జాతైః**
**ఆద్యైర్మునిభిః స్తుతే ప్రసీద! మమ॥**

**తాత్పర్యము:–** విద్యా స్వరూపందాల్చినదానా! అవిద్యను అంతమొందించు దానా! విద్వాంసుల అంతరాత్మలో తళుక్కున మెఱయుదానా! పద్య గద్యములతో ప్రాచీనమునులచే స్తుతింపబడినదానా! నాపై అనుగ్రహము వర్షింపుము.

**10. త్రిముఖి! త్రయీ స్వరూపే!**
**త్రిపురే! త్రిదశాభివందితాంఘ్రియుగే।**
**త్రీక్షణ విలసిత వక్త్రే!**
**త్రిమూర్తి మూలాత్మికే! ప్రసీద! మమ॥**

**తాత్పర్యము:–** ముఖత్రయము గలదానా! పశ్యంతీ మధ్యమా వైఖరీ ముఖములు గలదానా! వేదశాస్త్ర కావ్యముఖములు గలదానా! వేదత్రయ స్వరూపమైనదానా!

త్రిపురములకు అధిపతివయినదానా! దేవతావందిత పాదారవిందములు గలదానా! మూడు కన్నులతో అలరారుచున్న ముఖపంకజము కలదానా! మూర్తిత్రయమయిన బ్రహ్మవిష్ణుమహేశ్వరులకు మూలమైన ఓ మహా సారస్వత శక్తీ! నాదరూపా! నన్ను అనుగ్రహింపుము.

**11. వేదాత్మికే! నిరుక్త**
**జ్యోతిర్వ్యాకరణకల్పశిక్షాభిః।**
**సచ్ఛందోభిః సన్తత**
**క్లుప్తషడంగేంద్రియే! ప్రసీద! మమ।।**

**తాత్పర్యము:–** వేదస్వరూపురాలవు, నిరుక్తం, జ్యౌతిషం, వ్యాకరణం కల్పం, శిక్ష, ఛందస్సు అనే ఆఱు వేదాంగములు నీకు అవయవములలోనివి. అట్టి వాగ్దేవతా! అనుగ్రహింపుము.

**12. త్వచ్చరణసరసిజన్మ**
**స్థితి మహితధియాం న లిప్యతే దోషః।**
**భగవతి! భక్తి మతస్త్వయి**
**పరమాం పరమేశ్వరి ప్రసీద! మమ।।**

**తాత్పర్యము:–** తల్లీ! నీ పాదాంబుజములందు నిలిచిన పవిత్రబుద్ధిశాలులకు ఏదోషములున్ను అంటవు. ఓ భగవతీ! ఓ పరమేశ్వరీ! నీయందు పరమమైన అంటే నిష్కారణమైన నిశ్చలమైన భక్తిని అనుగ్రహింపుము.

**13. బోధాత్మికే బుధానాం**
**హృదయాంబుజ చారురంగ నటన పరే।**
**భగవతి! భవభంగకరీం**
**భక్తిం భద్రార్థదే! ప్రసీద! మమ।।**

**తాత్పర్యము:–** జ్ఞానస్వరూపురాలా! ఆ స్వరూపముతో జ్ఞానుల హృదయ



కమలములనే రంగస్థలములందు నృత్యముచేయు నర్తకీమణీ! ఓ భగవతీ! భవభయహారిణీ! భద్రదాయినీ! నీయందు నిరంతరభక్తిని ప్రసాదింపుము.

**14. వాగీశీస్తవమితి యో**
**జపార్చనాహవన వృత్తిషు ప్రజపేత్।**
**స తు విమలచిత్తవృత్తిః**
**దేహాపది నిత్యశుద్ధ మేతి పదమ్।।**

**తాత్పర్యము:–** ఇది వాగ్దేవతాస్తుతి. దీనిని సారస్వత జప తర్పణ హోమములు చేయు సందర్భమున పఠింపవలయును. అట్టివాడు నిర్మలచిత్తముగలవాడై దేహాంతమున నిత్యనిర్మలమైన స్థానమును పొందగలడు.

**ఇతి శంకరాచార్య రచితం వాగ్దేవీస్తోత్రం**
**సమాప్తమ్**